# మనవి.

పాఠక మహాశయులారా!

పరమేశ్వర కటాక్షముచేఁ గల్గిన నా కవితాశక్తిని మీ యెదుటఁ బెట్టుట కేవల సాహసము. నా కవితకిది ప్రప్రథమప్రయత్నము. దోషభూయిష్ఠముగ నుండునని యెఱింగియు భక్తిరసావేశముచే వెనుదీయలేనైతిని. నాకులాఁగులనాటి నేస్తుఁడును విద్వత్కవియు నైన బ్రహ్మశ్రీ నైవ్యశాస్త్రి ఈశ్వర సత్యనారాయణశాస్త్రి గారు దీని దోషముల ననేకములను దొలఁగించి ప[illegible]గ్యముగ నొనర్చ శ్రమగొన్నందులకు నాకెంతయు వందనీయులు. భక్తినే ప్రధానముగాఁ గొని దోషములను మన్నింపఁ బ్రార్థించుచున్నాఁడను.

కరిమల్లిప్పేట.
గంజాంజిల్లా
30-4-1932.

ఇట్లు,
భక్తపాదరేణువు
పిసపాటి సోమనాథము.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

# శ్రీ వల్లభ శతకము.



శా॥ శ్రీమత్తారకదివ్యనామ ! విలసచ్ఛీతాసతీకామ ! సు
త్రామారాధిత పాదభూమ ! విలసత్కాలాంబుదశ్యామ ! శ్రీ
రామా ! సర్వగుణాభిరామ ! త్రిజగద్రాజ్యాభిరామా । భవ
న్నామానంద మొసంగవేడెదనుఁ బ్రాజ్ఞస్తుత్య ! శ్రీవల్లభా! 1

మ॥ కరివక్త్రుం దొలుతన్ భజించి, పిదపన్, గంజాక్షివాగ్దేవతన్
గరమున్ భక్తి నమస్కరించి, మదిలోఁ గౌతూహలంబొప్పఁగా
హరి! నేనీశతకంబుఁ జెప్పెదను నీయంఘ్రుల్ మదిన్నిల్పి, స
ద్వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా!

మ॥ ఉరుకావ్యంబులు, లక్షణాదికము, భాషోక్తుల్, పురాణావళీ
పరిపూర్ణార్థములెట్టివో యెఱుఁగ! నీపాదాబ్జ సద్భక్తియే
శరణంబంచుఁ దలంచి పల్కెదను నీ సద్వర్ణనా పద్యముల్
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా!

శా॥ (శ్రీ) రమ్యంబగు జీవనాంచితలసచ్ఛ్రీ వంశధారానదీ
తీరప్రాంతము, భక్తపాళికరతంత్రీ వాద్యసన్నాదితం
బారామాది విభాసితంబు, విబుధావాసానుసంధానమౌ
నైరగ్రామము, నీ నివాసము, జగన్నాథుండ! శ్రీవల్లభా! 4

శా॥ (శ్రీ) రోణంకినివాసుఁడన్ బ్రథితమౌ శ్రీ పీసపాట్యాఖ్యమౌ
సారబ్రాహ్మణ వంశజన్ముఁడను, సంజ్ఞన్ సోమనాథుండ, శ్రీ
భారద్వాజసగోత్రుఁడన్, ఘనతరాపస్తంబసూత్రుండ, నన్
గారుణ్యామృతవృష్టిఁ దన్పఁగదవే; కంజాక్ష! శ్రీవల్లభా! 5

మ॥ పతిసేవారత, నామమాత, గతపాపవ్రాత, ఘనాంబశ్రీ
సతిపూజాపరతంత్రి, నా సుతుఁడు నీ సద్భక్తి యుక్తుండు గా
వ్రతముంజుగ్గుసబోయనేమొ భవదంభోజాతపద్భక్తియు!
గ్రసింగ్రాంచెను నామొకెమ్మృనుగతుల్ కంజాక్ష ! శ్రీవల్లభా! 6

శా॥ ఒక్పావాస్త్రము సర్వనిత్యమును న్యామోదారతల్ సొమ్ముగా
మొక్కులొన్దుచునాళ్లుపుచ్చిన మహామేనాని నా తండ్రి శ్రీ
యప్పన్నార్యుఁడు చెప్పి నీ కథలు బాల్యంబందుఁ బోషించె మా
యప్పా ! వానికిముక్తినీఁ గడవె దేవా ! నైర శ్రీవల్లభా ! 7

కేశవాదినామావళి.

మ॥ గిరిభాగంబునఁ బీడి సీరముసకై క్రీడాపరత్వంబునన్
సరసిన్ నక్రముచేతఁ జిక్కువడినిన్ సద్భక్తిఁ బ్రార్థింపఁగాఁ
గరిరాజున్ మొఱ యాలకించి కరుణన్ గాపాడవే, కేశవా
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 8

మ॥ ధరణీనీరహుతాశ వాయునభముల్, తజ్జాతభూతావళుల్
తరణీందుల్, గ్రహతారకల్, గిరిసముద్రింబుల్, మహీజంబులున్
సరిదాదుల్, భవదీయరూపములు కంజాతాక్ష! నారాయణా
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 9

మ॥ కరుణాసాగర ! భక్తవత్సల ! రమాకాంతామనశ్చోర ! నిన్
గిరిధారుండని కంజనేత్రుఁడని సంకీర్తించి వర్ణించుటల్
సరియౌనే ? పరికింప నీయుపమ గో సర్వేశ్వరా ! మాధవా !
వరదా ! మొక్కి కృపంగానవే కరుణ; దేవా ! నైరశ్రీవల్లభా! 10

శా॥ కందర్పాయురి దివ్యసుందర తనూ ! కౌమోదకీధారణా !
బృందారణ్యనివాస ! మోహనవంశీ ! వేదాంతవేద్యా ! నినున్
సందర్శించుటకన్న వేఱగలదే ! సౌఖ్యంబుచింతింప గో
విందా! సుందరహాసవక్త్ర ! కరుణాబ్ధీ ! నైర శ్రీవల్లభా! 11

శా॥ కృష్ణా! నంత! ముకుంద! మాధవ! హృషీకేశా! రమాధీశ! రో
చిష్ణూ! సాధితదైత్యనాయక! కృపాసింధూ! మహాతేజ! యో
విష్ణూ! శేషశయాన! సాంబనుత! సర్వేశా! శ్రితానంద వ
ర్ధిష్ణూ! మొక్కెదఁ గావవే; కలుషహారీ! నైర శ్రీవల్లభా! 12

మ॥ పతగేంద్రుండు జటాయువప్పుడు భవత్పత్నీహరున్ రావణున్
మతిమంతుండయి ఘోరసంగరమునన్ మార్కొడ్డి నిర్భీకుఁడై
జితుఁడై నిన్నన, వానికీవిడవె యక్షీణోర్ధ్వసల్లోకముల్;
ఇతరంబుల్లను బ్రోవవే, మధువిదారీ! నైర శ్రీవల్లభా! 13

మ॥ నమదిందాద్రిది కిరీటశోభి నవరత్నార్చిః కలాపంబు, సం
క్రమితాశేషవిశేషపుణ్య దివిషద్గంగాంబుపూరంబు, స
త్కమలామోదము నీదుపాదము, లసత్కౌశేయవాసా! త్రివి
క్రమ! నేఁ గొల్చెద నిల్వవేఁడిదిని, రంగా! నైర శ్రీవల్లభా! 14

మ॥ ధరణీరేణుసమూహ సంఖ్యయు, లసత్తారావళీ సంఖ్యయున్
గురువారాశితరంగసంఖ్యయును సంకోచింప లెక్కింపఁగా
హరి! నీదివ్యగుణంబులన్నుడువనాహా! శక్యమా! వామనా!
వరదా! మ్రొక్కెదఁగావవే కరుణ; దేవా! నైరశ్రీవల్లభా! 15

మ. గరుడాదిత్యసభశ్చరాది దివిషత్కాండంబు నీ కీర్తనా
పరమై, నిర్భయమై, జరారహితమై, భద్రాత్రమై, భావ్యమై
చిరలక్ష్మీయుతమై వెలింగెడిని నీ సేవారతిన్ శ్రీధరా!
వరదా! మ్రొక్కెదఁ గానవే కరుణ౯; దేవా! నైర శ్రీవల్లభా! 16

శా. ఈశానాది దిగీశ్వరార్చితపదా! హేమాద్రిధీరా! హరీ!
ఆశాపాశనిబద్ధులై జనులునిన్నర్చించుటల్ మాని త
న్నాశంబున్ బొనరింపఁజాలమి భవన్మాయావృతిన్ శ్రీహృషీ
కేశా! క్లేశవినాశ! భక్తజనసంగీ! నైర శ్రీవల్లభా! 17

మ. నరుఁడత్యంతవిమోహియై యుభయసేనామధ్యమక్షోణి శోకిఁ
గరుణన్ సంగరకాంక్షమానుటయు, సత్కారుణ్యమేపారఁగా
నరగీతార్థముపన్యసించితివి దేవా! పద్మనాభా! రమా 18
నర! తత్త్వార్థమొసంగవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా!

శా. సోమార్కోజ్జ్వలదివ్యనేత్రయుగళా! క్షోణీసుతాధీశ్వరా!
కామారాత్యాది సురేంద్రవందితపదా! కారుణ్యవారాం నిధీ!
భీమోద్దామపరాక్రమా! యభవ! గోపీనాథ! దామోదరా! 19
రామా! తారకనామ! దుష్టజనదూరా! నైర శ్రీవల్లభా!

మ. ఏదసంసారదవాగ్నిఁ గ్రాఁగుటయు నిన్నే దూషిగాఁ గొల్వ, నీ
పదసేవామృతవృష్టిఁ జల్లఁబడి సంభావింప సంకర్షణా !
పదనై యున్నది; కాలయుక్తి నగుటన్ భక్తి ప్రబీజంబులన్
సదయన్ నాటవె తంపరై నెలయఁ గంసధ్వంస! శ్రీవల్లభా! 20

మ. ధరణిన్ మానవజన్మమెత్తియును నీతత్త్వంబుఁ జింతింపకే
తరుణీపుత్త్ర ధనాభిలాష దినముల్ దాటింతు నేఁ గాని నీ
చరణాంభోరుహ చింతసేయను రమేశా! వాసుదేవా ! కృపా
కర! నేమ్రొక్కెదఁ గావవే; దురితభంగా! నైర శ్రీవల్లభా! 21

మ. హరకోదండ విఖండనాద్భుతబలా! హర్యక్షమధ్యా! శుభం
కర! పాపౌఘభయంకరా! మునిమనఃకంజాతవళీ భాస్కరా!
పరశిక్షా! శ్రితరక్ష! పక్షిగమనా! ప్రద్యుమ్న ! నారాయణా!
వరదా! మ్రొక్కెదఁగావవేకరుణ; దేవా! నైరశ్రీవల్లభా! 22

మ. ఇనకోట్యర్బుదదివ్యతేజ! గరుడాహీంద్రాది సంసేవితా!
వనజాతాయత చారునేత్రయుగళా! వందారుబృందారకా
వనదక్షా! కరుణాకటాక్ష! మునిరాట్పక్షా! విపక్షాంతకా!
అనిరుద్ధా ! నినుభక్తిఁగొల్చెద; మహాత్మా! నైర శ్రీవల్లభా! 23

మ. తురగంబుల్, రథముల్, ఘనంబులు, ప్రజాస్తోమంబు, సత్సౌఖ్యముల్
కరిసంఘంబులఁ గోరఁ, బోఁడుగద నీ కారుణ్యరాజ్యంబుచే
కురు భక్తుండు నృసింహమూర్తీ! నినునేఁ గొల్తుం దదావాప్తికై
వరదా! శ్రీపురుషోత్తమా! వనజనాభా! నైర శ్రీవల్లభా! 24

మ. నరకారాతి! యధోక్షజా! యభవ! నీనామామృతాస్వాదనా
పరితోషంబున కే సుఖంబు సరియౌ? బాధోధిగంభీర! శ్రీ
వర! తత్సౌఖ్యమొసంగఁ జూడుము, భవత్పాదాబ్జముల్ గొల్చెదన్
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 25

మ. ధరసింహాసనమా, నభంబుగొడుగాఁ, దల్పంబు శేషాహియా
గురువారాశినివాసమా, నిగమవాక్పూరంబు నీస్తోత్రమా
నరసింహా! ధృతభవచ్ఛిదాయకము నీనామంబు సంభావ్యమా
వరదా! మ్రొక్కె, దంగాననేకరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 26

మ. సరిదారామ సరోవరాదిక జగత్సామగ్రి తన్నేనియుఁ
సరిగాసృష్టిని దోఁచుచుండుట భవత్సంకల్ప, మీహోష్ఠగా
నరయఁ రక్షణ, మూరికంటు విలయంగా, నీమహాత్త్వంబు నె
న్వరుగన్నోఁగల రచ్యుతా! నిగమభావ్యా! నైర శ్రీవల్లభా! 27

మ. ధృతశార్ఙ్గాసిగదా సుదర్శనములున్ శ్రీపద్మసాకారముల్
శ్రితభక్తాళ్య భయప్రదానకలనా శ్రీయుక్తముల్ శత్రుసం
తతిభీదంబులునీకరంబులు, మహాత్మా మాముకాపాడు శ
త్రుతతింగూల్చుతమో జనార్దన ! లసత్కోదండ! శ్రీవల్లభా!

శా. చంద్రార్కానలకోటితేజ! విలసచ్చంద్రార్క నేత్రా! దయా
సాంద్రా! సంశ్రితతాపనోదగుణనిస్తంద్రా! ఉపేంద్రా ! హరీ
సాంద్రానందపురందరాది దివిషత్సందోహసంపూజ్యా! దే
వేంద్రా! నిర్జితదానవేంద్ర! కరుణాబ్ధీ! నైర శ్రీవల్లభా! 29

మ. మురళీనాదసుధాభినందితజగత్పుంజా! సుకంజాక్ష! శ్రీ
ధర! గోపీజనతారణప్రియ! లసత్కల్యాణమూర్తీ! సురే
శ్వరగర్వాపహచక్రవర్తీ! జితదుష్టవ్రాత! శ్రీకృష్ణ! స
ద్వరదా మ్రొక్కెదం గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 30

మ. సరసీజాక్షము, శంఖచక్రయుతముం, సౌవర్ణకేయూరముం
వరమాణిక్యకిరీటశోభితము, సద్దివ్యాంబరోపేతముం
బరమానంద రమావిభూషితము, సంభావ్యంబు నీ రూపముం
వరదా! మ్రొక్కెదం గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 31

శా. నీకల్యాణగుణాళికంతుగలదే! నీదివ్యనామంబుల
శ్లోకాదా తుదిచేసినైనను మునుల్ లెక్కించి వాకొంటనే
నాకల్యాణదమంచు భక్తిరతితో నారెంచు సంజేర్చింపుతే
వాకొంటిన్ నవరత్నహారముగ దాల్పన్ రాదె శ్రీవల్లభా. 32

మ. హరసీరేజభవాదులున్ మనములో సత్యంతభక్తిన్ నినున్
సరిగానెన్నఁగనేరరంట యికనే షడ్వర్గలోలాత్ముఁడన్
బరమున్ నిన్ను నుతింపనేరుతునె! నీపాదంబులే గొల్చెదన్
వరదా! మ్రొక్కెడఁగావవే కరుణ; దేవా! నైరశ్రీవల్లభా. 33

మ, మహనీయాగమవర్ణనా కుశలుఁడౌ పంకేజగర్భుండనా,
విహగాధీశుఁడనా, సదాశివుఁడనా, విశ్వంభరానాథ! నిన్
వహియింపంచగు భోగినాయకుఁడనా, వల్మీకజన్ముండనా,
మహితుల్ నిన్నొనియాడనావశమె; రామా! నైగశ్రీవల్లభా. 34

శా. ప్రాతఃకాలమునందుమేల్కాంచి శుభప్రారంభుఁడై, నిర్మల
స్నాతుండై విజనప్రదేశగతుఁడై సద్భక్తిసంయుక్తుఁడై
ధ్యాతృధ్యేయ వివేకుఁడౌచు నియతిన్ ధ్యానింపఁగా నొప్పునిన్
సీతాధీశ్వర! జన్మపావనతకై, చిద్రూప! శ్రీవల్లభా. 35

మ. కదళీపుష్పసమాన మష్టదళయుక్తంబౌ మహాపద్మము
దుదయార్కప్రతిభమ్మై మణిస్థగితమ్మై యొప్పారుపీఠంబునం
దు, దయాసాగరుఁ గోటిసూర్యనిభు నెంతో భక్తి శ్రీరాఘవుర్
బదిలంబొప్పఁగనిల్పి పూజసలుపర్ భద్రంబు; శ్రీవల్లభా. 36

మ. లలితేందీవర సుందరాంగుని విశాలాక్షుర్ సువక్షస్థలుర్
సులలాటుర్, సుకపోలుఁగుండలయుతుర్ సుభ్రూయుగుర్ నీలకుం
తలు, నానాద్భుతరత్నహారయుతు సీతాసుందరీ సంయుతుర్
జెలువొప్పారఁగఁ బూజసేయఁదగునిం జిత్తాన; శ్రీవల్లభా! 37

శా. వామాంకంబున జానకీరమణి చెల్వంబొప్ప సామీరియున్
బ్రేమన్ ముంగట, వెన్కలక్ష్మణుఁడు, సంప్రీతిన్ భజింపన్, ఘన
శ్యామాంగున్ గడుభక్తితో భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ గొల్వ, స
త్రామాత్రున్ రఘురామదేవునిను నేధ్యానింతు; శ్రీవల్లభా. 38

మ. ఇనసైన్యాత్మకకోటితేజ! వరదా! యీప్రాజసంప్రాప్తిమా
దనుకన్ నిల్పవు, సాధనానమతినై తాత్పర్యయుక్తుండనై
ఘనకారుణ్యకటాక్షవీక్షణముచేఁ గైకొమ్ము నీవానిఁగా
వినతానందనవాహ! ప్రోవఁదగవే వేవేగ; శ్రీవల్లభా. 39

శా. వైకుంఠంబును దివ్యతన్ విడిచి సద్వాత్సల్యమేపారఁగా
సాకేతంబున సూర్యవంశజుఁడవై సద్రామరూపంబునన్
మాకాంతన్విడి భూమిజాయుతుఁడవై మాణిక్యపీఠంబునన్
గైకోవే శుభదాసనంబుగ; జగత్కల్యాణ! శ్రీవల్లభా. 40

శా. హృద్యానందమహాబ్ధియై వెలయునాహృద్వీధిలో సంతతా
విద్యన్మానిచి సత్కళాన్వితుఁడవై, విజ్ఞానపూర్ణుండవై
పద్యంబుల్ విని మోదమందఁగదవే భవ్యాత్మ! వేదాంతసం
వేద్యా! పాద్యమిదే! చిరానఁగొనుమా! విశ్వాత్మ! శ్రీవల్లభా. 41

మ. ఇనవంశోద్భవ! కౌసలేయ! దితిజాతేభేంద్రసింహా! నమ
జ్జనతాచిత్త శుభాలయా! యనఘవిశ్వామిత్ర యాగావనా!
మునిపీడాకర తాడకాకులహరా! ఫుల్లాబ్జనేత్రా! కృపం
గొనుమాయర్ఘ్యము, నీకొసంగెద, మహాకోదండ! శ్రీవల్లభా.

మ. అమలామోఘపవిత్ర పాదయుగ! పాషాణాత్మయై యొప్పు గౌ
తమపత్నిన్ సతిగానొనర్చిన భవత్పాదాబ్జ సద్ధూళిచే
తమదీయంబగు మూర్ధమొప్పడు పవిత్రంబై విరాజిల్లు; నా
చమనంబీయదె ప్రీతిఁగైకొను; మహాచ్ఛారిత్ర! శ్రీవల్లభా. 43

శా. కీనాశోపమబాహువిక్రమ రణక్రీడాసమారంభ దై
త్యానీకాద్భుత సంగరోద్భవమహాయాసంబు చల్లారఁగా
నానాతీర్థసముద్భవంబులగు సన్నీరంబులం దెచ్చితిన్
స్నానంబొప్పఁగఁ జేయవే; వికసితాబ్జాతాక్ష! శ్రీవల్లభా. 44

మ. పదివేపుర్వులవంతులెత్తఁగ మహాభారంబుగాఁదోఁచునా
మదనారాతిధనుస్సు నొక్కత్రుటి, సామాన్యంబుగాఁ ద్రుంపవే
సుదయాబ్ధీ! మహనీయకాంతియుతమై శోభిల్లుపీతాంబరం
బిదె యర్పించెదఁ గట్టవే; యసమధన్వీ! నైరశ్రీవల్లభా! 45

శా. వేదోక్తాచరణీయముల్ సలుపఁ, గావింపన్ సుధానాదులన్
వేదాంతార్థ రహస్యముల్ దెలియ! సర్వేశా! మనంబందు నీ
పాదాంభోరుహముల్ స్మరింతునిఁక నాపై నీదయన్ జిల్కవే
మోదంబొప్పఁగ నూర్ధ్వపుండ్రమిడుదున్ మోమొస్తు శ్రీవల్లభా!

మ. ఇరవౌ లోకములెల్ల నీయుదరమందే పారఁగా నొప్పు సుంద
దరరూపుండవు భక్తపాలన కళాతాత్పర్యయుక్తుండవో
యరవిందాక్ష! సుచంద్రికాధవళమౌ యజ్ఞోపవీతంబిదే
వరదా! మ్రొక్కెదఁ బ్రీతిదాల్పఁగదవే వైకుంఠ! శ్రీవల్లభా! 47

శా. కందర్పాయుత సుందరంబగు భవత్కల్యాణరూపంబు ముం
సందర్శించి మునీంద్రులాసమెయి నోస్వామీ! నినుంగోరరే
ఛందోవేద్య! సుకుంకుమాదియుతమౌ సచ్చందనంబిత్తు నీ
వందంబొప్పఁగ దేహమందలఁదవే యబ్జాక్ష! శ్రీవల్లభా. 48

శా. కాలాంభోధరనీలదేహ! విలసత్కస్తూరికాఫాల! శ్రీ
లోలా! సంతతభక్తకీర్తిత శుభశ్లోకా! ప్రతాపోజ్జ్వలా!
లీలామానుషవిగ్రహా! భయదదోర్లీలా! హరిద్రింబులౌ
శాలీయాక్షతలుంతు నీదుతలభూషల్గాఁగ శ్రీవల్లభా. 49

మ. కలితాత్యంతపరీమళంబులగు నాకల్పప్రసూనాళిగా
జలజాతంబులఁ, జంపకంబుల, లసజ్జాజీలతాంతంబులన్
విలసత్కేతకులన్, గులాబులను, దావింగ్రమ్ము మేల్మల్లెలన్,
దులసీమాలలఁబూజచేసినిను; సంతోషింతు శ్రీవల్లభా. 50

శా. పాపంబుల్ బహుళంబుగాఁ జలిపితిన్ బాధించితిన్ సాధులన్
గోపంబున్ ఘటియించితిన్ గుమతినై కోపింపఁబోకయ్య! నా
పాపంబుల్ హరియింప సర్వశుభముల్ ప్రాపింప సద్వాసనా
ధూపంబిచ్చెదఁగొమ్ము పాపుమిఁక నాదుఃఖంబు; శ్రీవల్లభా. 51

శా. వ్యాపారంబులుమాని సంతతము సద్వ్యాసంగమే చేయుచున్
గోపాదుల్ దిగనాడి భక్తిగరిమన్ గోవిందచింతారతిన్
దాపంబుల్దొలఁగంగఁజేయు నతఁడే ధన్యాత్ముఁడౌనంచు నే
దీపంబిచ్చెదజ్ఞానదానమిడరాదే నాకు; శ్రీవల్లభా. 52

శా. క్రవ్యాదోత్తమసంగరంబులు, జగద్రక్షాప్రయత్నంబులున్
నీవ్యాయామములాట నాకలియగున్; నీరేజపత్రాక్షు! స
ద్ద్రవ్యంబౌఘృతమున్, ఫలంబులును, వేడ్కన్ షడ్రసోపేతమౌ
దివ్యాన్నంబిడుదున్ భుజింపుము; కృపాబ్ధీ! నైర శ్రీవల్లభా. 53

శా. సంబోధించినమాటలేమఱల నీసంబోధసంబయ్యె, నా
యంబో, దోసమొ, యజ్ఞుఁడం దెలియ,నీయాలాపమేయీగతిం
సంబోధంబొనరింపఁజేసె, నీకనోసర్వజ్ఞ! కర్పూర స
త్తాంబూలంబిదె ప్రీతిఁగైకొనఁగదే; దైత్యారి! శ్రీవల్లభా. 54

మ. కరుణాసాగర! భక్తవత్సల! లసత్కంజాత పత్రేక్షణా!
సురుచిభ్రాజిత రత్నకుండలయుతా! సుశ్లోక! సర్వాత్మకా!
గరుడారూఢ! యమేయకాంతికలితా! కర్పూరనీరాజనం
బురిహింగొమ్ము సుమంగళంబిడఁగదే, పూతాత్మ! శ్రీవల్లభా. 55

మ. సిరులన్నింటికి మూలకందమగు లక్ష్మీదేవినీపత్ని, నీ
వరయంగాఁ బురుషోత్తముండవు, గృహంబానీకు క్షీరాబ్ధి, నీ
కరుదా? యెద్దియొసంగఁగానని మనోజ్ఞాతంబు నీకిచ్చెదన్
గరుణంజేకొనుమంత్రిపుష్పముగ, భక్తత్రాణ! శ్రీవల్లభా! 56

మ. నిపుణంబౌగతి భక్తిగీతములతో నృత్యంబుతోఁ గొల్చుచో
విపులామోదమునొంది మేనెఱుఁగ; నేవిద్యావిహీనుండ నా
యపరాధంబులు సైఁపుమీ, కొలలుమాయంజూడుమీ, దేవ! భ
క్త్యుపచారంబులు మెచ్చువాఁడ విటురావో కావ; శ్రీవల్లభా. 57

శా. జేజే, పూర్ణశశాంకసుందరముఖా! జేజే, కిరీటోజ్జ్వలా
జేజే, రాగవిహీనచిత్తసులభా! జేజే, సుబోధాంచితా!
జేజే, సర్వదిగీశ్వరార్చితపదా! జేజే, శ్రితానందదా!
జేజే, సర్వజగచ్ఛరణ్యా! సితరాజీవాక్ష! శ్రీవల్లభా. 58

శా. అంభోజాయతనేత్ర! భక్తిరతితో నారాధనల్సల్పు ని
ర్దంభుం బ్రోచెదవన్న నీదునుడియే రాజత్ప్రమాణంబుగా
శుంభన్మానసి కార్చనంబుగను సంక్షోభిల్ల వాకొంటినో
జంభారిప్రముఖామరార్చితపదా! సర్వేశ! శ్రీవల్లభా! 59

మ. ధరణిన్ సోమకనామదానవుఁడుబల్ దర్పంబునన్ వేదముల్
సరసీజోద్భవునొద్ద దొంగిలి, వెసన్ సంద్రంబులోఁ దాఁగినన్
వరమీనాకృతివానిఁ ద్రుంచి నిగమవ్రాతంబుఁ జేర్పవే
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా. 60

మ. సురలుం దైత్యులు మందరాద్రిని గడుం జోద్యంబుగా క్షీరసా
గరమందుంచి మథింప భారమగుడుం గంపించి లోఁగ్రుంగినన్
గురుకూర్మాకృతినెత్తవే గిరిని నాకుల్ నిన్ బ్రశంసింపఁగా
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నైర శ్రీవల్లభా! 61

మ. అరివిధ్వంసన బాహువీర్యుఁడు హిరణ్యాక్షుండు లోకంబులన్
బరివేధింపసురాళి కుయ్యిడఁగ నప్పాపాత్ముఁ హింసింప సూ
కరరూపంబును బొందలేదెమును భూకాంతా సముద్ధర్తవై
వరదా! మ్రొక్కెద గానవే కరుణ; దేవా! శ్రీరమావల్లభా. 62

మ. అరవిందోదర! నీదుభక్తుఁడగు ప్రహ్లాదుండు నిన్గొల్వఁగా
గురుశిక్షావిధిఁ జెప్పి తదురుఁడు సక్రోధాత్ముఁడై యేపఁగా
నరసింహాకృతిబూని దైత్యునుదరాంత్రంబుల్ విదారింపవే
పరమామోదముతోడ భక్తునిఁ గృపం బాలింప శ్రీవల్లభా. 63

మ. సురనాథున్ బలిదైత్యభర్త కదనస్థున్ నిర్జితుం జేసి, యు
ద్ధురుఁడై యేపఁగ వామనుండవయి దైత్యుం జేరి యాచించి యి
ద్ధరణిన్ మూఁడడుగుల్ త్రివిక్రముఁడవై తద్దర్పముం బాపవే!
కరుణం గూర్పవె, నాకమింద్రునకు వేట్కన్; నైరశ్రీవల్లభా. 64

మ. అసురాధీశు దశాస్యు గెల్చిన సహస్రాభీల హస్తోద్ధతిన్
బ్రసభుం డా కృతవీర్యపుత్రునిఁ గుఠారాఖండ ధారాహతిన్
వెస ఖండింపవె, త్రుంపవే నృపతులన్, విప్రాళి రక్షింపవే
యసమానోజ్జ్వల భార్గవాకృతిని దేవా! నైరశ్రీవల్లభా. 65

మ. దశకంఠుండు పురందరాది సురలం దర్పోన్నతిన్ గాఢ దు
ర్దశలంబెట్ట నజుండు గుయ్యిడఁగఁ దద్రక్షోవిభుం ఘోర ది
వ్యశరాళిందునుమాడవే, యలఁతిగా వారాశిబంధింపవే
యశముల్ నింపవె రాఘవాకృతిని; మాయాతీత! శ్రీవల్లభా. 66

మ. ఖలులౌ దైత్యులు దుష్టభూపతులు దోర్గర్వంబునన్ లోకులం
గలఁతంబెట్ట సధర్మమే పరిబలనాకంసాది దుష్టాత్ములన్
బలరామాకృతిఁ గృష్ణరూపమునఁ దున్మంగ లేదె ధీరుండవై
యిలధర్మంబును నిల్పవే; భుజగశాయీ! నై ర శ్రీవల్లభా! 67

శా. సద్ధర్మంబు నెఱుంగఁజాలకజనుల్ జాత్యాదిభేదంబులన్
శుద్ధబ్రహ్మముఁ జెందకుండుటను సంశోధించి తద్బోధనా
బుద్ధిం దత్త్వవిచారముల్ సలుపవే! బుద్ధాకృతిన్ జ్ఞానివై
యిద్ధానందమయస్వరూప! వరదాయీ! నైరశ్రీవల్లభా! 68

మ. కులధర్మంబులు శాస్త్రమార్గములు సంకోచంబుగాఁదోఁచు నీ
కలికాలంబున వేదసూక్తవిధులంగాపాడి సద్ధర్మముల్
నెలకొల్పం గలికావతారమున నీనేలం బ్రకాశింతువో
జలజాతాయతనేత్ర! కోటిరవితేజా! నైరశ్రీవల్లభా. 69

శా. నానాపాపతమోర్కబింబము, విపన్నానీక రక్షాక్షమం
బానందాబ్ధిసుధాకరంబు, జనితాహంకారనాశంబు, వి
జ్ఞానాపాదనకారణంబగు, జగన్నాథా! భవన్నామమో
దీనానాథశరణ్య! సద్గుణగణాబ్ధీ! నైరశ్రీవల్లభా. 70

శా. గంగాసంభవమూలముల్, మునిమనఃకంజాతబాలార్కముల్
శృంగారాబ్జనివాసకుల్ సతతలక్ష్మీమానసాహ్లాదముల్
లింగాఖ్యీశవినోదముల్, విభవశాలీ! నీ మశ్రీపాదముల్
కొంగుంబంగరుమూటలౌ గ్రితులకున్, గోపాల! శ్రీవల్లభా. 71

శా. సీతాధీశ! భవత్పదాబ్జయుగళీ సేవామృతాస్వాద సం
పూతాత్ముండగునేని నన్నుఁగొలువంబోఁ జూచువాఁడుండునే
చూతాస్వాదసలోలమైన శుకముంబోఁ క్కించునే యన్యముల్
వాతాపత్య సదార్చితాంఘ్రియుగ! దేవా! నైరశ్రీవల్లభా. 72

శా. నీతోఁ గవ్వల, నర్మగీతములన్, నీతోడి సయ్యాటలన్
నీతో ముచ్చటలాడుటన్, గలయుటన్, నీమూర్తి దర్శించుటన్
జేతోమోదము నొందఁజేయఁగదవే సీతేశ! సంసేవక
వ్రాతత్రాత! శుభప్రదాత! రఘువీరా! నైరశ్రీవల్లభా. 73

మ. రవిగన్పట్టెడువేళ మేలుకొని నీరమ్య స్తవంబుల్ రహిన్
సవిశేషోన్నతి సంస్మరించి, పిదపన్, సంసారకృత్యంబులన్
భవదీయాంఘ్రులు మర్వకే సలిపి ప్రాప్తద్రవ్యసంతుష్టుఁడై
దివసముల్బుచ్చెడువాఁడె ధన్యుఁడు; కృపాబ్ధీ! నైరశ్రీవల్లభా. 74

శా. సారాచారవిచారహీనుఁడయి, సంసారంబునన్ మగ్నుఁడై
నారీబాంధవ పుత్రపోషణ రతిన్ద్రవ్యాది సంబద్ధుఁడై
గోరంతైన సుఖంబుగానకెపుడుం గుందున్ జడుండెంతకున్
పారంబున్ గనలేఁడు పంకరుహనాభా! నైరశ్రీవల్లభా. 75

మ. విత్తైశ్వర్యమదాభిభూతులగు నుర్వీభర్తలీసంపదల్
సతమంచున్ భ్రమఁజెంది మూఢులగుచున్ సర్వేశునిన్ వీడి సం
తతమున్ దుర్విషయాప్తిఁ బొంగెదరు నీతత్త్వంబుఁ జింతింపకే
పతితుల్గాఁగ యతింతురజ్ఞతను దేవా! నైరశ్రీవల్లభా. 76

మ. హరిసేవారతిఁజొక్కునట్టు లెపుడేనాశింతునేకాని వా
నరమట్లింతయు నిల్వదిమ్మనసు నీనామామృతాస్వాదనా
పరతంజొక్కఁడునట్లు సేయఁగదవే భక్తార్తినాశా! హరీ!
వరదా! మ్రొక్కెదఁగావవే కరుణ; దేవా! నైరశ్రీవల్లభా. 77

మ. సిరివక్షంబునఁ జెన్నుమీఱ విలసచ్ఛ్రీవత్స మేపారఁగాఁ
గరముల్ చక్రగదాదులన్మెఱయఁగాఁ గాలాంబుదశ్యామవ
ర్ణరదేహోజ్జ్వల కాంతులన్నిదిశలన్ వ్యాపింప నీరూపమున్
వరదా! కంటికిఁజూపిప్రోవఁగదె దేవా! నైరశ్రీవల్లభా 78

శా. పారావారవిహార! శేషశయనా! భక్తాఘకల్పద్రుమా!
నీరేజాక్ష! సరోజనాభ! విలసన్నీలాంబుదశ్యామ! సం
సారాంభోనిధితారణా! భవహరా! సర్వేశ్వరా! శాశ్వతా!
దారిద్ర్యంబుఁబోలంచి ప్రోవుము, ముకుందా! నైరశ్రీవల్లభా! 79

మ. ధరణీభృద్వరధారణా! పదనమద్దాసౌఘ సంతారణా
చరణోద్ధత్యఫణీంద్ర దర్పదళనా! చాణూరవిధ్వంసనా!
కరిరాట్ఛోకనివారణా! నిఖిలభక్తవ్రాతరక్షాచణా
వరదా! మ్రొక్కెదఁ గావవే కరుణ; దేవా! నై రశ్రీవల్లభా. 80

మ. పతియెవ్వండొకో, భార్యయెవ్వతెయొ, సంభావింపఁగాఁ జోద్యమా
పితయెవ్వండొకో, మాతయెవ్వతెయొ, గంభీరార్థమీభావమే
మతిమంతుండు కనుంగొనంగలుగునో మాయాబ్ధిలోఁగ్రుంకఁడో
యతఁడే జ్ఞానివరుండు; భోగివరతల్పా! నై రశ్రీవల్లభా. 81

మ. అప్పేనిప్పగు, నిప్పెయగును, నీయాజ్ఞానుసారంబుగా
నప్పేనీకయనంబగుఁ దలఁపఁగాఁ నాథ్యుండవీవన్నిఁటఁ
దప్పుల్ పల్కితివేలరాయని ననుండండింపఁగాఁ జోషనూ
యప్పా! యొప్పులకుప్ప! ప్రోవఁగదవే; యజ్ఞాక్ష! శ్రీనల్లభా. 82

మ. గ్రహచారంబో, కళావిశేషము, మహాత్మ్యమాంధకారంబొకో
సహజంబోయిది జంతుకోటికి భవత్సంకల్పమో? మాయయో
అహహా! నిన్నాలునంగఁజాల రిదియేమయ్యా! మహాశ్చర్యమా
నృహరీ! మ్రొక్కెదఁగావవే కరుణఁ దండ్రీ! నైరశ్రీనల్లభా. 83

మ. మహనీయాగమ వేదశాస్త్రములలో మర్మంబులై చెప్పు నా
బహుళార్థంబుల బోధసేయఁగదవే భద్రానుసంధాయివై
సహజోద్యోగ రమానిభాసితమహా సచ్చిత్కళాశాలలో
సహహా! నీవుపదేశకుండవుగదా! యజ్ఞాత్మ! శ్రీవల్లభా. 84

శా. సత్యాదిషణ బంధసప్రతతినో? శాంతంబులేకున్కినో
సత్యాభాషణ దోషహేతువుననో? శైత్యాదిరోగాలనో
పైత్యాధిక్యముచేతనో? మనము సంభ్రాంతంబగుఁ, దీనిలో
సత్యంబున్వివరింపుమా, యొసఁగుమాసద్భక్తి శ్రీవల్లభా. 85

మ. తనునైనం దగవిక్రయించి ధనసంతానంబుఁ జేకూర్చినా
ధనముంగోల్పడి దుఃఖభాజనుఁడగుం దౌర్జన్యయుక్తుండు; స
జ్జనుఁడో సంతతమల్పలాభమునకే సంతుష్టుఁడై మోక్షసా
ధనమంచున్ భవదంఘ్రిపీఠముఁగదా ధన్యుండు; శ్రీవల్లభా! 86

మ. హరియన్నన్ హరుఁడన్న నేమి? మదిలో నాద్యంత శూన్యుండనన్
బరమాత్మున్ సకలాంతరాత్మునను సద్ధ్యానైకనిష్ఠితిన్
హరిగిర్యాది సమస్తరూపములలో నన్నంటఁ జింతింపఁగా
సరిగాఁ జూచిన నొక్కఁడై వెలయవే; సర్వజ్ఞ! శ్రీవల్లభా! 87

శా. ఓమన్వర్ణము సర్వమంత్రములలో నుద్యోత మూలార్థమా
యోమన్వర్ణము సర్వయోగిజన హృద్యోగాను సంధానమా
నామార్థంబది తేటతెల్లముగ నానామూల బోధింపుమా
స్వామీ! భక్తశరణ్య! సద్గుణగణా! సర్వేశ! శ్రీవల్లభా. 88

మ. నరసంసేవిత చారుపాదయుగళా! నందాదిసంపూజితా!
నరనారాయణయోగిరూప! సకలజ్ఞా! శ్రీరమారాధితా
గిరిధారీ! జితదానవా! నరహరీ! గీర్వాణరక్షాచణా!
వరదా! మ్రొక్కెదఁగావవే కరుణఁ; దేవా! నై ర శ్రీవల్లభా. 89

శా. మోదంబందెదొ లేదొ నీమనమునన్ బోధస్వరూపా! హరీ!
మోదంబొప్పఁగఁ జెప్పుమా వినెద నామోదంబదెట్లున్నదో
మోదంబందితివా సరే! యిఁకను నీమోమైనఁ జూపింపుమా
మోదంబొప్పఁగ; సంతసింతు నిఁక నీమోదంబు శ్రీవల్లభా. 90

శా. రామా! నీ కొకరాజమాతృఁడవె నీరాజత్వరూపంబు సు
త్రామాద్యస్తుతమై జగద్విదితమై రామానగం సేవ్యమై
సామాన్యాగమప్రాజ్యమై వినవమై సంశోభితంబయ్యెనో
రామా! గణ్యమునామమొక్కు, విశేసంత్రాసంబు; శ్రీవల్లభా. 91

శా. మాడల్ మేడలుగల్గఁగానె హరినామం బొందగుఁ విస్మృతుల్
మాడల్ మేడలు తోడవచ్చునని సంభావింతు రజ్ఞానులు తో
డ్తోడఁ వేచెదు మృత్యువుంగనక దామఃఖంబునొందుం దుదిఁ
వేదఁ నిఁగునె, కాంచునిత్యసుఖముఁ విశ్వేశ! శ్రీవల్లభా. 92

మ. యమునాంతఃస్థిత కాళియాహిని ననాయాసంబుగాఁద్రొక్కి నీ
యమలంబైన పదంబుఁ జూపితికదా! యత్యంతకారిత్వమో
విమలంబైన సుభక్తియో? కతమగుఁ వేదండసంరక్ష! నీ
కమనీయాబ్జపదంబులందుటకు, సత్కారుణ్య! శ్రీవల్లభా. 93

మ. పరమాసహ్యసాదిసంయుతములౌ భామాకుచద్వంద్వముల్
విరిచెండ్లంచు సువర్ణకుంభయుగళీ విస్ఫూర్తులంచుం జనుల్
గురుమోహాప్తినుతించి చెందుదురుగా గొంచెంపుసౌఖ్యంబులన్
మురవైరీ! నినుఁగొల్చినంగలుగదే మోక్షంబు; శ్రీవల్లభా! 94

ఉ. సరయూతీరవిహార! భక్తతరణా! సాకేతసంచారణా!
హరిరాడ్భంజనమార్గణా! హరిణమాయాదైత్య శిక్షాచణా!
గురుపాపౌఘనివారణా! శుభగుణా! కోదండవిద్యాఘనా!
వరదా! మ్రొక్కెదఁగావవే కరుణ; దేవా! నైరశ్రీవల్లభా. 95

మ. హనుమత్సేవితపాదయుగ్మ! సురనాథైశ్వర్యసంరక్ష! యో
వనజాక్షా! శ్రీనిపక్ష! యక్షయకృపావార్ధీ! కిరీటోజ్జ్వలా!
ఘనచాపాంచితదోర్యుగా! శుభకరా! కాలాంబుదశ్యామలా!
యినవంశోద్ధర! భక్తలోకవరదాయీ! నైరశ్రీవల్లభా. 96

మ. నుతిసేయంగ సమర్థుఁడే విపులయత్నుండయ్యు నేవాఁడునున్
సతతంబున్ భవదీయభక్తుఁడగుచున్, సర్వేశ! దక్షుండగున్
మతిలోనీకుఁ గృపాలవంబుగలుగన్ మాన్యుండువాఁడన్నిటన్
వితతాభీష్ట ఫలప్రదాయక! దయావేశాత్మ! శ్రీవల్లభా- 97

మ. మతముల్ పెక్కులు, శాస్త్రముల్ బహుళముల్, మంత్రంబు లాకోటులా
శ్రుతులాభిన్నవిధంబు, లద్భుతవిరాడ్రూపంబు నీతత్త్వముల్
పతితుండెవ్వఁడెఱుంగనేర్చును? భవబ్రహ్మదులే చాలరా
శ్రితమందారమవంచుఁ గొల్చెద, ననుంజేపట్టు; శ్రీవల్లభా. 98

మ. అకలంకాత్ములు! యోగపూర్ణులు! మహాధ్యాత్మార్థతత్త్వజ్ఞులుల్
బ్రకటజ్ఞానవిభూతిసంయుతులు! సంప్రఖ్యాతి ప్రాఘాఘులా
శుకభీష్మాదులు గొల్తురెప్పుడునినుఁ బ్రోవన్ దలిట్లుండఁగా
నిఁకఁనీవేల, యటంచుపీడకుము, తండ్రి! నన్ను శ్రీవల్లభా 99

శా. వాఁడో పుట్టకపూర్వమందెకొలిచెన్! వాఁడో ననుంబాడెఁ న
వ్వాఁడో పిన్నతనంబునుండి కొలిచెన్! వాఁడో ననుంబట్టె న
వ్వాఁడో నిత్యముఁదాల్చునన్ భుజములన్! వాఁడో సుతల్పంబగున్
వీఁడేపాటియటంచు వీడకుమునన్; విశ్వేశ! శ్రీవల్లభా. 100

శా. నాఁడేపల్కితి నీదువాఁడనని; యానాఁడే నినున్వేడితిన్
నాఁడేకొల్చితినిన్ను నీపదముల న్భక్తావళీ రక్షణం
బేడ న్వేడనినిన్నుఁ గోఁతినినుఁగట్లేఁ బట్టితిన్ నీవునన్
వీడంజూచిన నేనువీడనుజుమీ! విశ్వాత్మ! శ్రీవల్లభా. 101

శా. ఉండుందా హరియొక్కఁడే తలఁప వేరొండేమియున్ లేదుగా;
ఉండుండా సకలాంతరాత్ముఁడయి వేరొం డొక్కఁడోఁ గాదుగా;
రెండేమాటలు రూఢిగాఁ దెలియ వేఱింకేమియున్ లేదుగా;
రెండైక్యమునొందఁగా నతఁడె సర్వేశుండు; శ్రీవల్లభా. 102

శా. కొన్నాళ్ళేగెను బాల్యకేళుల, మఱింకొన్నాళ్ళు స్త్రీలోలతన్
కొన్నాళ్ళాత్మకుటుంబరక్షణరతిం, గొన్నాళ్ళు రోగాదులన్
గొన్నాళ్ళే యిఁకనున్నకాలమని యూహింజాలమున్ మాని, నీ
సన్నామామృతమద్ధిఁ గ్రోలవను సేసన్ భక్తి శ్రీవల్లభా. 103

మ. శరచాపంబులు బూని సానుజుఁడవై క్ష్మాత్మజాసమేతుండవై
కరుణం జిల్కెడు మందహాసరుచిఁ గన్పట్టెదెల్లప్పుడున్
గరుడారూఢుఁడవై చతుర్భుజుఁడవై కల్యాణసంధాయివై
కరుణన్ గన్పడిపోవరాదె? విలసత్కంజాక్ష! శ్రీవల్లభా. 104

మ. వరచక్రాంకితుఁ మూర్ధ్వపుండ్రధరుఁడు నై వైకుంఠపూజార్చనా
నిరతుండాత్మవిదుండు భూసురుఁడు మన్మిత్రుండు సుశ్లోకుఁడున్
నరహర్యక్షపదాబ్జభక్తుఁడు జగన్నాథుండు ప్రేరేపఁగా
బరమార్థంబని చెప్పితిన్ శతకమున్; భద్రాత్మ! శ్రీవల్లభా! 105

శా. బత్తుల్ చంపకమాల లుత్పలములీఁ బాడై నశార్దూలముల్
మత్తేభంబుల నీతడిచ్చెననుచుఁ మర్యాదలేదందువో
సత్త్రామాత్రుడ! క్రూరసామ్యులయెడఁ సామ్యంబుజూపితువం
చోక్తాబత్తిని జాటగోరుపనిగా నూహించు శ్రీవల్లభా. 106

శా. ఏవో తప్పులు కొన్నిగల్గ నవియేమెన్నంగ నూహింతువో
నీవేదిద్దను తప్పులుండిననుమానీ! తప్పునీదేయగుఁ
నీవేదిద్దినఁ దప్పులుండునటరా! నీరేజపత్రేక్షణా
రావో వచ్చెదవో నిజంబనుము మారాకార శ్రీవల్లభా. 107

ఉ. అందముతోడ నీశతకమంచితభక్తి రసాత్మకంబుగా
నందతనూజు భవ్యకరుణన్ రచియించెను సోమనాథుఁడా
నందముతోడ దీనివినినన్ గనినన్ బఠియించినన్ సదా
యిందునునందుఁ బొందెదర హీనసుఖంబులు స్వామిసత్కృపన్ 108

— సంపూర్ణము. —

## చందనాదిసారము సీసా రు. 4_8_0

సెగరోగములకు భయపడ నవసరములేదు. 3 దినములు సేవించిన పోటు, మంట, మున్నగునవి పోయి సుఖముగా నిద్రపట్టును.

## అమృతపాశము 40 తు. రు. 4_0_0

ఇది నిజముగా నమృతమే. ధాతుపుష్టిని చేయుటలో దీనికి మించినది లేదు. నరములకు బలము చేయును. సంభోగశక్తి నధికపరచును. గుండెకు, ఊపిరితిత్తులకు మంచి బలముచేయును.



# శ్రీ గాయత్రీ ముద్రణాలయము,



శ్రీకాకుళం——గంజాంజిల్లా.

ఈ ముద్రణాలయం సుమారు **50** సంవత్సరములనుండి పనిచేయుచున్నది. ఇందు పనిచేయు పనివారలు అనుభవశాలురని వేరే చెప్పనవసరములేదు. ఇందు అన్నిడిపార్టుమెంట్ల అచ్చుపనులన్ని యు, పలువిధములగురంగులతో ముద్దులోల్కు బ్లాకులతో తెనుగు, ఇంగ్లీషుభాషలలో అమెరికాదేశపు క్రొత్తయంత్రములపై సరసమై నధరలకు సకాలమునకు చేయబడును. గాన మీమీఅచ్చుపనులను యిచ్చుటకు నేడే ప్రయత్నింపుడు.

